గాయత్రీ గ్రంథమాల - 31
ప్రథమ ముద్రణము - 1000

సృష్టి సంవత్సరము : 197,29,49,101
196,08,53,101
దయానందాబ్దము : 176
శ్రీ విక్రమ - కార్తీక పౌర్ణమి (2000)

మూల్యము : రూ. **2=50**

ప్రతులకు :

1) గాయత్రీ ఆశ్రమము, వ్యాస్ వైదిక సేవా సమాజము
12-10-586/6, వ్యాస్‌నగర్, (ఇందిరానగర్ రోడ్డు, నెం. 2)
సీతాఫల్‌మండి, సికింద్రాబాద్ - 500 061.

2) మాశెట్టి శ్రీనివాస్, Shop No. 5, మాశెట్టి బిల్డింగ్,
3–3–736 to 740 , కంచరి బజార్, సికింద్రాబాద్ - 3. ఫోన్ : 781 2904

3) ఆర్ష గురుకులము, వడ్లూరు, కామారెడ్డి - 503 111

4) వైదిక సాహిత్యభండార్, సుల్తాన్ బజార్, హైదరాబాద్ - 95.

5) ఆర్. కృష్ణమూర్తి, బుక్ సెల్లర్, ఆర్యసమాజము,
సీతాఫల్‌మండి, సికింద్రాబాద్ - 61.

Designed & Printed at
PRINTSHOP
Sec'bad. Ph : 7812904



# వేదాలలో అప్సరస - గంధర్వులు

పురాణాలలో గంధర్వులు - అప్సరసల కథలున్నాయి. ఈకథలలో దేవలోకంనుండి భూలోకం వరకు వ్యాపించియున్న వారి ఆకర్షణతో కూడిన లీలలు- క్రీడల వర్ణనలు, అద్భుత కార్యాలు చేయటంలో వారికిగల శక్తి మున్నగు వాని చిత్రీకరణ మనకు కనబడుతుంది. భోగాలపై ఆసక్తిగల స్త్రీ, పురుషులు వీనిని చదివి చలించి చపలచిత్తంతో ఊహాలోకంలో విహరిస్తూనే ఉంటారు. లేదా మన ప్రాచీన ఋషులు, దేవతల చరిత్ర ఇలా ఉంటే మానవులమైన మన మాటేమిటి? అని తలంచి వారిని అసహ్యంచుకుంటారు.

పురాణాలలో గంధర్వలోకమనే దొకటుంటుంది. అందులో ఒక నగరం ఉంటుంది. దానిలో కొందరు స్వర్గంలో ఉంటారు. స్వర్గాని కి అధిపతి-ఇంద్రుడు. ఇతడు దేవతలకు రాజు. ఇంద్రుని సభలో ఈ సౌందర్యవంతులైన అప్సరసలు ఎల్లప్పుడు గంధర్వులతో కలిసి నృత్యంచేస్తూ పాడుతూ, దేవతలను వ్యామోహంలో పడవేసి వారిని సంతోషపెడుతుంటారు. తమ సుందర రూపంతో కూడిన హావభావాలతో ఋషుల తపస్సును భంగం చేస్తూంటారు. ఈ అప్సరసలు స్వర్గంలోని గంధర్వపత్నులు. స్వర్గస్థులైన పుణ్యాత్ముల మనస్సును ఈ అప్సరసలు తమ సహచర్యంతో రంజింపజేస్తూంటారని చెప్పే మన పురాణగాథలను నేటికిని మన సమాజంలోని ప్రజలు నమ్ముచున్నారు. మధ్యకాలంలోని శాస్త్రజ్ఞులైన కొందరు ఆచార్యులు తమ భాష్యాలద్వారా శాస్త్రాలలో ఆధారాలను చూపి ఈ నమ్మకాలను ఇంకా దృఢంగా చేశారు. అథర్వవేదంలోని 4వ కాండలోని ఒక మంత్రం ఇలా ఉంది-

మం: జాయా ఇద్వో అప్సరసో గంధర్వాః పతయో యూయమ్ ।
అప ధావతామర్త్యా మర్త్యాన్ మా సచధ్వమ్ ॥
(అథర్వ 4-37-12)

సాయణాచార్యులు తన వేద భాష్యంలో ఈ వేదమంత్రానికి సాధారణ అర్థాన్ని వ్రాస్తూ-
గంధర్వాః= ఓ గంధర్వులారా! అప్సరసః= ఈ అప్సరసలు, వః=మీకు, జాయాఇత్= అనుభవించుటకు యోగ్యులైన స్త్రీలు-పత్నులే, యూయమ్ పతయః = మీరు వారి పతులు, (అందువలన అంతా కలసి) అమర్త్యాః= మరణంలేని దేవ జాతికి చెందిన మీరు, అపధావత= ఆ అప్సరసల వైపుకు పరుగెత్తండి, మర్త్యాన్= మరణించునట్టి భిన్నజాతి మానవులను, మా సచధ్వమ్= మీరు కలువ వద్దు. (మీలో వారిని తీసుకోవద్దు). మరొక వేదమంత్రంలోకూడా ఈ అప్సరసలు గంధర్వపత్నులని ఉంది. వీరు దేవలోకంలో నివసించేవారి మనస్సులను ఆకర్షిస్తుంటారని, భూలోకంలోని మానవులను తమ మాయావీ రూపంతో భయపెడుతుంటారని ఈ మధ్యకాల భాష్యకారులు వ్రాశారు. ఆ వేదమంత్రం ఇలా ఉంది-

**మం: యాః క్లందాస్తమిషీచయో అక్షకామా మనోముహః ।**
**తాభ్యో గంధర్వ పత్నీభ్యో అప్సరాభ్యో అకరం నమః ॥**
(అథర్వ వేదం 2-2-5)

యాః=ఎవరైతే, క్లందాః=(క్లందయిత్ర్యోమనుష్యాన్ ఆవిశ్య రోదయిత్ర్యః) స్వర్గలోకంనుండి దిగివచ్చి భూలోకంలో నివసించేవారు అనగా మనుష్యులపై పూని వారిని ఏడ్పించేవారు. తమిషీచయః= అత్యంత బలశాలినేగాక, అక్షకామాః= (అక్షాణి ఇంద్రియాణి తాని నాశయితుం కామాః) పూనినవారి ఇంద్రియాలను, వారి పనిచేసేశక్తిని నాశనము చేయగోరువారు, మనోముహః= మనస్సును మోహింపజేసి ఉన్మాదమును కలిగించునట్టి గంధర్వపత్నులైన - అప్సరసలకు, తేభ్యో అకరం నమః= (అట్టి వారికి) నా నమస్కారము. అని అర్థము వ్రాశారు.

అంతేగాక ఈ సూక్తంయొక్క వినియోగవమువంతటికిని

సాయణాచార్యులు నక్షత్రకల్ప- శాంతికల్ప మున్నగు నిరాధార గ్రంథాలను ఆధారంగా చూపిస్తూ ఏదైనా గ్రహం ( శిరస్సును) ఆవహిస్తే, అకస్మాత్తుగా ఎప్పుడైనా నెయ్యి, మాంసం, తేనె, ధూళి మున్నగు వాని భయంకర, అద్భుత వర్షం కురుస్తుంటే, మర్కటం (కోతి) శ్వాపద (పులి) గోమాయువు (నక్క), కప్ప మున్నగు నానా రూపాలు ధరించినట్టి యక్ష గంధర్వాదులతో కలయిక జరిగితే గంధర్వులు - రాక్షసులు- అప్సరసలు- భూతగ్రహాలు మున్నగువాని శాంతి కొరకు చతుష్పథ - నాల్గు రోడ్ల కూడలిలో ఈ మంత్రాలతో హవనం చేయాలి అని వ్రాశారు. ఇందువలన జరిగిన దుష్పరిణామమేమంటే విదేశాలకు చెందిన విద్వాంసులు తమ దేశాలలో నెలకొన్న అజ్ఞానాంధకారం, అభివృద్ధి చెందక పోవుటవంటి లోపాలను కప్పిపుచ్చుకొనుటకు మంచి అవకాశం లభించింది. వారెంతో ఉత్సాహంగా భారతదేశంలోని స్థితికూడా తమ దేశంలోవలెనే ఉండేదని చెప్పసాగారు. భారతదేశంలో నివసించే ప్రజలుకూడా భూత, ప్రేత, పిశాచాలు, గారడీ విద్యనం నమ్ముచుండేవారన్నారు. పాశ్చాత్య విద్వాంసుడైన యం.వింటర్ నిట్జ్ ఈ విషయాన్ని ఒకచోట ఇలా వ్రాశాడు. ''ఇతర జాతుల వలెనే భారతదేశంలోకూడా మగ ఆడ రాక్షసులు రాత్రులందు పురుషులు- స్త్రీలపై ఆవరింతురు (పూనుదురు). ప్రాచీన భారతీయులు వీరిని అప్సరసలు- గంధర్వులని నమ్ముచున్నారు. జర్మనీలోని సాధారణ ప్రజలు నమ్మే భూతాలు, మరుగుజ్జువారితో ఈ గంధర్వ అప్సరసలు సమానం అనే విషయం ఆశ్చర్యాన్ని కలిగిస్తుంది.''

ఈ విషయం వేదంలో చూస్తే గంధర్వులు - అప్సరసలు అనే పేరుగల శరీర ధారులైన స్త్రీ-పురుషులు వేరుగా ఒక లోకంలో నివసించే పతి-పత్నులు ఎవరూ లేరని స్పష్టమౌతుంది. ఇవి గుణ వాచకాలగుటచేత ఏ స్త్రీయైనా అప్సరసయని అట్లే ఏ పురుషుడైనా గంధర్వుడని పేర్లు కలిగి యుండవచ్చును. ఇంతేగాక సృష్టిలోగల సూర్యుడు- చంద్రుడు వంటి గొప్ప-గొప్ప కాంతివంతమైన పదార్థాలుకూడా గంధర్వులుగాను

వాటిలోగల వివిధ శక్తులు అప్సరసలుగా పిలువబడతాయి. వైదిక వివాహ సంస్కారంలో రాష్ట్ర భృద్ హోమం జరుగుతుంది. దీనిలో యజుర్వేదంలోని 18వ అధ్యాయంలోని కొన్ని మంత్రాలు వినియోగింపబడ్డాయి. ఈ ప్రకరణం అగ్ని- సూర్య- చంద్రాదులను గంధర్వులని పేరుపెట్టి మరీ చెపుతున్నది. ఓషధులు, మరీచులు (సూర్యకిరణాలు) నక్షత్రాదులు ఆ గంధర్వుల అప్సరసలు (పత్నులు). దీనిని గూర్చి విశేషంగా ముందు చెపుతాను. ఇచ్చట గంధర్వ- అప్సరస శబ్దాలకు యౌగిక అర్థాలతో నిర్వచనం చెప్పినట్లయితే విషయమంతా స్పష్టంగా అర్థమౌతుంది. ముందుగా గంధర్వ శబ్దం తీసుకుందాం. **'గవి గన్ ధృఞోవః'** అనే ఉణాది సూత్రంతో- 'గో' శబ్దం ఉపపదంలో ఉండగా 'ధృ' ధాతువునకు 'వ' ప్రత్యయం వస్తుంది. తదుపరి 'గో' శబ్దమునకు 'గన్' ఆదేశమౌతుంది.

**''గాం ధరతి ధారయతి వా యః స గంధర్వః।''** అనగా గోవును ధారణ చేయువాడు గంధర్వుడు. గో శబ్దానికి నిఘంటువులో సూర్యరశ్మి, వాణి, పృథివి మరియు స్తుతి చేయువాడు మున్నగు నామములున్నాయి. ఈ విధంగా ఎలాంటి విశేష ప్రయాసలేకుండా 'గో' అనగా రశ్మిని ధరించే సూర్యుడు గాని లేక చంద్రుడుగాని గంధర్వుడని పిలువబడును. ఇదే విధంగా 'గో' అనగా వేద లక్షణయైన వాక్కు, వేద రూపియైన వాణిని ధరించేవాడు- గంధర్వుడు- పరమాత్ముడు- ఆ వేదవాణిని అధ్యయన- ప్రవచనాలద్వారా తన జీవితంలో ధరించే బ్రాహ్మణుడు కూడా గంధర్వు డనబడతాడు. 'గో' శబ్దానికి పృథివి యనే అర్థాన్ని గ్రహించినట్లైతే పృథివిని ధరించేవాడు అంటే భూమిపై నివసించే ప్రాణులను తన భుజబలంతో రక్షించేవాడు- క్షత్రియుడు కూడా గంధర్వు డనబడతాడు. 'గో' శబ్దానికి పశువు, ఆవు లేక ఎద్దు అనే అర్థాన్ని గ్రహిస్తే వానిని ధరించేవాడు అనగా వాని ద్వారా దేశంలో సుఖ- సంపదలను పెంపొందించువాడు- వైశ్యుడు కూడా గంధర్వుడనబడతాడు. అంతేకాదు 'గమ్' ధాతువునకు 'గతి' అనే-

అర్థం కూడా ఉంది. దీనితో ఉత్పన్నమైన ఈ 'గో' శబ్దం 'గాం' అనగా గతిని ధరించే, నిరంతరం సేవ చేయుటలో నిమగ్నమై సమాజంలో ఒక భాగమైన శూద్రుడు కూడా ఈ గంధర్వ శబ్దంతో పిలువబడతాడు. 'స్తుతి' అర్థంకల 'గా' ధాతువుతో 'గో' శబ్దం సిద్ధిస్తుంది. 'గాం' అనగా స్తుతిని ధరించేవారు అనగా స్తుతించుటలో ప్రవీణులు- గానవిద్యా విశారదులైన గాయకులనుకూడా గంధర్వులని పిలుచుట సముచితంగా ఉంటుంది. ఇట్లు ఒకే శబ్దానికి అనేక అర్థాలున్నందున ప్రసంగాన్ని బట్టి ఆయా స్థానాలలో ఆయా విశేషార్థాలు గ్రహించాలి. ఉదాహరణకు :, ఇంతకుముందు చెప్పిన ''యాఃక్లిందా.... నమః'' అనే వేద మంత్రంలోని ప్రసంగాన్నిబట్టి గంధర్వ శబ్దం పరమాత్మకు వర్తిస్తుంది. ఆ సూక్తంలోని మొదటి మంత్రం ఇలా ఉంది.

మం: దివ్యో గంధర్వో భువనస్య యస్పతి రేక ఏవ నమస్యో విక్ష్వీడ్యః।
తం త్వా యౌమి బ్రహ్మణా దివ్యదేవ నమస్తే అస్తు దివి తే సధస్థమ్॥
(అథర్వ వేదం 2-2-1)

అర్థం: యః=అతడు, దివ్యః= అద్భుతమైన గుణకర్మ స్వభావాలుకల, గంధర్వః= పరమేశ్వరుడు, భువనస్య పతిః= ఈ ప్రపంచానికి యజమాని, విక్షు= ప్రజలందరిలో, ఏకఏవ నమస్యః= నమస్కరించుటకు యోగ్యుడైన ఒకే ఒకడు, ఈడ్యః= స్తుతించ తగినవాడు, తం త్వా= అట్టి నిన్ను, దివ్యదేవ= ఓ పరమేశ్వరా! నేను, బ్రహ్మణా యౌమి= నీ సత్యజ్ఞానమైన వేదం ద్వారా పొందుదును (మోక్షమును పొందుతాను). తే నమః అస్తు = నీకు నా నమస్కారము, దివి= ప్రతివ్యవహారంలో, తే= నీకు, సధస్థమ్= నా జీవితంలో సమాన స్థానముండుగాక! అనగా నేనుచేసే ప్రతి పనిలో నీ వెల్లప్పుడు నాతో ఉండు. ఈ ఆధ్యాత్మికపరమైన అర్థమే సుందరంగా ఉంది కదూ! ఇదే గంధర్వ శబ్దాన్ని బ్రాహ్మణాది నాలుగు వర్ణాల వారికి అన్వయిస్తే అది ఆధిభౌతికార్థ మౌతుంది. సాయాణాచార్యులు ఈ మంత్రంలోని గంధర్వ శబ్దానికి సూర్యుడనే అర్థాన్ని గ్రహించి ఎంతో సుందరమైన ఆధిదైవికార్థాన్ని చేశారు. కానీ తరువాతి మంత్రాలలో అసంగతము- పరస్పర సంబంధంలేని-

హాస్యాస్పదం- విపరీతం- అబద్ధమైన అర్థాలను చేయసాగారు. కారణమేమిటో ఆయన బుద్ధి అలా ఎందుకు మారిందో ఆయనకే తెలియాలి. వాస్తవానికి ఇచ్చట ఈ ఒక్క మంత్రమేకాక పూర్తి సూక్తమునకు వివిధ ప్రక్రియలలో చాలా సుందరమైన అర్థాలు చెప్పవచ్చును.

ఇప్పుడు 'అప్సరస' శబ్దమును గూర్చి తెలుసుకుందాం. గంధర్వ శబ్దంతో కలిపి చెప్పిన ''అప్సరస'' శబ్దానికి కేవలం గంధర్వ పత్నులనే అర్థమేగాక, గంధర్వులలోని శక్తికికూడా పేరు. ఈ శక్తిద్వారానే గంధర్వులు తెలియబడతారు. 'అప్సరస' శబ్దం 'అప్' మరియు 'సర్' అను రెండు శబ్దాలు కలిస్తే ఏర్పడుతుంది. ''సర్ త్తే రప్పూర్వాద్వాదసిః'' అనే ఉణాది (4-237) సూత్రంతో 'అప్' పూర్వమున గల 'సృ' ధాతువునకు 'అసి' ప్రత్యయం కలిపితే సకారాంత 'అప్సరస్' శబ్దం తయారౌతుంది. ఈ శబ్దం వేదంలో ఆకారాంత 'అప్సరా' అని సకారాంత 'అప్సరస్' అని రెండురకాలుగా ఉంది. ఈ రెండూ నిత్య బహువచనంలో ఉండే స్త్రీలింగ శబ్దాలు. వైదిక శబ్దకోష నిఘంటువులో 'అప్' లేక 'ఆపః' అనే శబ్దం జలం, అంతరిక్షం, కర్మ, పద నామాలలో ఉంది. ఇదికాక ఆప్ల్ప= వ్యాప్తౌ; ఆప్ల్ప= లంభనే అను ధాతువులతో తయారైన ఈ 'ఆపః' శబ్దం వ్యాపించే గుణం గల ప్రాణాది పదార్థాలన్నింటికీ వర్తిస్తుంది. అందువలన ''అప్సు= జలేషు, ప్రాణేషు, కర్మసు అంతరిక్షే వా సరతీతి అప్సరాః'' అనగా నీటిలో, ప్రాణాలలో, కర్మలలో లేక అంతరిక్షంలో వ్యాపించేది మరియు ప్రాణాది పదార్థాలలో ప్రవేశించే క్రియాగుణంగల పదార్థాలన్నింటినీ అప్సరస శబ్దంతో పిలువవచ్చును. ఈ ఆపః శబ్దానికి 'నీరు' అనే లౌకికార్థం తీసుకొని పాశ్చాత్య విద్యాంసుడు (యం.వింటర్ నిట్జ్ అప్సరస శబ్దానికి జలపక్షి అని అర్థం చేసి, జర్మనీ దేశంలోని జలపక్షులతో భారతదేశంలోని అప్సరసలను పోల్చాడు. ఇది వైదిక శబ్దాలకు సరియైన అర్థం తెలియక పోవుటవలన చేసిన పరిహాసాస్పదమైన అర్థం. నీటిలో ప్రవహించే గుణంగల విద్యుత్తును వేదం అప్సరస అనే పేరుతో చెపుతుంది. వేదాలు మొదలు పురాణాల వరకేగాక నవీన

సంస్కృత కవులు రచించిన సాహిత్యంలో కూడా ఈ ఊర్వశీ-అప్సరసలను గూర్చి ఎన్నో అశ్లీల కథలు వ్రాశారు. వానిని ఎరుగని వారు లేరు. వేదంలో 'ఊర్వశీ' శబ్దానికర్థం (ఉరు= మహదంతరిక్షమ్, అశ్నుతే= వ్యాప్నోతి అంటే) అంతటా విస్తరించి యుండి అంతరిక్షంలో వ్యాపించే విద్యుత్తని అర్థం. ఇది నీటిలో ప్రవహిస్తూ విద్యుత్ రూపంలో ప్రకటమవుతుంది. కనుక 'అప్సరస' అనే పేరుతో పిలువబడుతుంది. ఆపః= అంతరిక్షంలో ప్రవహించే (వీచే) వాయువునుకూడా 'అప్సరస' యనే పేరుతో పిలువవచ్చును. ఋగ్వేదంలోని (7-33-12) మంత్రానికి మహర్షి దయానంద సరస్వతి భాష్యం వ్రాస్తూ ''అంతరిక్ష చరాద్వాయోః'' అని వాయువనే అర్థం చెప్పారు. ఇదే విధంగా= అప్సు= ప్రాణేషు అనగా ప్రాణములలో చలనం కలిగించే ప్రాణప్రదాత-ప్రాణాలకు ప్రాణం పరమేశ్వరుడు. ఆయన అనంతశక్తిని కూడా 'అప్సరస' అనవచ్చును.

ఆపః శబ్దాన్ని కర్మ వాచకంగా చెప్పినప్పుడు బ్రాహ్మణుడు చేసే వేదాధ్యయనం- ప్రవచనం వంటి కర్మలలో ఆయనకు గల ''అప్సు కర్మసు సరణమ్'' ప్రవృత్తే బ్రాహ్మణుని అప్సరసలు. ప్రజలను పరిపాలించుట, భూమండలాన్ని రక్షించుటవంటి క్షత్రియుని కర్మలలో ప్రవృత్తి కలిగి ఆ పనులలో శ్రమించుటే క్షత్రియుని అప్సరసలు. అంతేగాని మధ్యకాలంలోని రాజుల వలె రాజప్రాసాదాలలోని అంతఃపురాలలో రాజులభోగాలకు ఉపయోగపడే రమణులు, అప్సరసలుగా పిలువబడే స్త్రీలు కాదు! ఇదే విధంగా వైశ్య, శూద్ర వర్ణాల వారికి కూడా వేదాది శాస్త్రాలు ఆదేశించే కర్మలు, నిర్దేశించే నియమాలు, పాటించే గుణాలు వారి అప్సరసలు. ఈ విధంగా అప్సరసలు లేని గంధర్వులు పూర్ణులుకారు. అందువలన ప్రతి గంధర్వుడు అనగా బ్రాహ్మణ క్షత్రియ వైశ్య శూద్రులు (అప్సరాపతి) అప్సరసకు పతి, అంటే శాస్త్రం తనకు ఆదేశించిన కర్మలకు యజమాని (స్వామి) కావాలి. అప్పుడే ఏ సమాజమైనా, దేశమైనా ప్రగతి మార్గంలో ముందుకు సాగిపోతుంది.

**''యో వై ప్రజాయతే స రాష్ట్రం భవతి అ రాష్టం వై స భవతి యో న ప్రజాయతే।'' (శతపథ బ్రాహ్మణం 9-4-1-5)**

ఉత్పన్నమయ్యే దానిని, ఉత్పత్తి చేసే సామర్థ్యం కల దానిని అనగా క్రొత్త క్రొత్త రచనాత్మక కార్యక్రమాలతో పరిపూర్ణమైన దానినే దేశమంటారు. పని దొంగలు, సోమరులు, చేతులు కట్టుకొని కూర్చుండేవారుండేది దేశం (రాష్ట్రం)కాదు. అది భ్రాష్ట్రం=మండే పొయ్యి ఔతుంది. శతపథ బ్రాహ్మణంలోని ఈ ప్రకరణంలోనే యజుర్వేదంలోని ''తాస్మై స్వాహా వాట్ తాభ్యః స్వాహా'' (యజుర్వేదం 18-38 నుండి 43) మంత్రాలకు శతపథ బ్రాహ్మణ వ్యాఖ్యాత గంధర్వునకు ఏకవచన ప్రయోగంఅప్సరసకు బహువచనంలోనూ ప్రయోగాన్ని చూచి ఒక్కొక్క పురుషునకు చాలామంది పత్నులున్నారని వ్రాసారు. అదిలా ఉంది-

**''పుంసే పూర్వస్య జుహోతి।.... ఏకస్మా ఇవ పుంసే జుహోతి బహ్వీభ్య ఇవ స్త్రీభ్య స్తస్మాదప్యేకైకస్య పుంసో బహ్వ్యో జాయా భవతి।'' (శత. బ్రా 9-4-1-5)**

బ్రాహ్మణ గ్రంథాలలోకూడా ఇలాంటి మాటలా? అని చదివినవారికి ఆశ్చర్యం కలుగుతుంది. అందుకే మహర్షి దయానంద సరస్వతి మాటిమాటికి- 'నేను వేదాలనే స్వతః ప్రమాణంగా అంగీకరిస్తాను. వేదాలకు బ్రహ్మాది మహర్షులు రచించిన/ ప్రవచించిన వ్యాఖ్యానాలైన బ్రాహ్మణాది గ్రంథాలను పరతః ప్రమాణంగా స్వీకరిస్తాను. అంటే అవి వేదానుకూలమైతేనే ప్రమాణంగా స్వీకరిస్తాను. లేనిచో అంగీకరించనని అనేకసార్లు గంటాపథంగా చెప్పుట, అనేకచోట్ల వ్రాయుట జరిగింది.

ఈ 'అప్సరస' శబ్దానికి మరొకరకమైన నిర్వచనం కూడా నిరుక్తాది శాస్త్రాలలో ఉంది. నిఘంటువులోని రూపనామాలలోగల అప్సరస శబ్దంతో మత్వర్థంకు సంబంధించిన 'ప్రశంసా' అర్థంలో 'ర' ప్రత్యయం, 'టాప్' ప్రత్యయాలు చేర్చగా ఆకారాంత 'అప్సరా' శబ్దం

తయారౌతుంది. దాని అర్థం-

''ప్రశస్తం అప్సః రూపం అస్యా అస్యాం వా అస్తీతి అప్సరా'' అంటే (ప్రశంసనీయ) అందరూ పొగిడే రూపంగల స్త్రీ లేదా- 'అప్స' ఉపపదంగా ఉన్నప్పుడు 'ఆదాన' మరియు 'దాన' అర్థాలుగల 'రా' ధాతువునకు బహుళంగా 'క' ప్రత్యయం, 'టాప్' ప్రత్యయాలు చేర్చగాకూడా అప్సరా శబ్దం తయారౌతుంది. దీనికి యాస్క మహర్షి చెప్పిన అర్థం- ''అప్సః= రూపమ్ తదనయా అత్తమితి వా, తదస్య దత్తమితి వా'' అంటే రూపమును పొందిన వారు లేదా ఉపహార రూపంలో రూపమివ్వబడిన స్త్రీ. శతపథ బ్రాహ్మణంకూడా గంధతో గంధర్వుని, రూపంతో అప్సరసను కలిపింది. అదిలా ఉంది-

''గంధేన చ వై రూపేణ చ గంధర్వాప్సర స శ్చరంతి''

(శత. బ్రా. 9-4-1-4)

ఈ రూపమనే వ్యుత్పత్తులను ఆధారంగా చేసుకునే జనులు 'అప్సరస' శబ్దానికి సౌందర్యంతోకూడిన, లౌకికంగాని, రూపవతియైన (దేవతా) స్త్రీ అనే కేవల ఆధిభౌతిక అర్థం తీసుకున్నారు.

వాస్తవానికి ''గంధర్వ స్యాప్సరా పతే'' (అథర్వవేదం 4-37-7)

వేద మంత్రాలలో అప్సరస పతిగా చెప్పిన గంధర్వునకు అప్సరస పతి అనే అర్థం ఈ విధంగా జోడింపబడుతుంది. అప్సరాపతి అనగా రూపమునకు స్వామి గంధర్వుడు. ఏ రూపంతో గంధర్వుడుగా పిలువబడుతాడో ఆ రూపమున కతడు స్వామి రక్షకుడు. అందువలన అతడు అప్సరాపతి అనబడతాడు. ప్రతి వ్యక్తి తన రూపానికి స్వామి ఔతాడు. ఒక వస్తువును తెలుసుకోవాలంటే రూపం ఆధారం. ప్రపంచంలోని పదార్థాలన్నింటికీ వేర్వేరు రూపాలున్నందుననే అవి కనబడుతున్నాయి. అలాగే గంధర్వులకు కూడా రూపముంటేనే తెలుస్తారు. గుణాలను బట్టి గంధర్వ శబ్దానికి అనేకార్థాలు పైన చెప్పాం. ఆ గుణాలను తెలియజేసే అనేక కార్యకలాపాలే వాస్తవానికి వారి రూపాలు.

అంటే అవే వారి అప్సరసలు. ఆ అప్సరసలకు వారు పతులు- స్వాములు. మొదట వేదమంత్రంలో చెప్పిన- ''జాయా ఇద్వో అప్సరసః'' అనే వాక్యంలో అప్సరసలను 'జాయా' అంటే గంధర్వులకు పత్నులని చెప్పుచున్నది. వాస్తవమునకు ఈ గంధర్వులు ఏరూపంలో ఉత్పన్నమౌతారో - ప్రకటమౌతారో ఆరూపమే ఆగంధర్వులకు 'జాయా'. ఎలా అంటే- పరమేశ్వరుడు గంధర్వుడు. కనబడే ఈ జగత్తంతా ఆయనయొక్క జాయ అనబడే అప్సరసలు. ఇవెన్నో విభిన్న రూపాలలో ఉన్నాయి. ఒకచోట అవి వ్యాపించియున్న సూర్యకిరణాలలో ఉంటే మరొక చోట నీటి రూపంలో ఉన్నాయి. ఒకచోట భూమిపై రకరకాల ఓషధులు, లతలు, పొదలు, పూవులలో వికసిస్తుంటే మరొకచోట పెద్ద పెద్ద విశాలమైన పర్వతాలు, సముద్రాల రూపంలో ప్రతిబింబిస్తున్నాయి. సూర్యుడైనా, చంద్రుడైనా, విద్యుత్తైనా అగ్నియైనా అన్నీ భగవంతుని ప్రకాశంతోనే ప్రకాశిస్తున్నాయి. ఆయన రూపంలోనే ప్రకటమౌతున్నాయి. ఈ రూపాలే గంధర్వ పరమేశ్వరుని 'జాయా ఏలయంన ఆయంన ఈ రూపాలలో (''జనీ=పాదుర్భావే'') ప్రకటమౌతున్నాడు. ఇవే ఆయన అప్సరసలు.

యజుర్వేదంలోని 18వ అధ్యాయంలో చెప్పిన గంధర్వులు- అప్సరసలు అనే శబ్దాలకు వాటి యౌగి కార్యాలను తీసుకుంటేనే సంబంధం కలుస్తుంది. ఆ మంత్రాలు యిలా చెపుతున్నాయి. అగ్ని గంధర్వుడు పృథివిని ధరిస్తున్నాడు. వాని అప్సరసలు అనగా ఏ రూపాలలో అగ్ని ప్రవహిస్తున్నదో అవి 'ముద్' అనే పేరుగల ఓషధులు. ఎందుకంటే అవి అందరికీ మోదంతి= ఆనందాన్నిస్తాయి. సూర్యుడు గంధర్వుడు. అతని అప్సరసలు ''ఆయువనే'' పేరుగల మరీచీ= కిరణాలు. ఎందుకంటే అవి ''ఆ సమంతాద్యువంతి = సంయోజకా వియోజకాశ్చ భవంతి'' అంటే అన్ని వైపులనుండి సంయోగ వియోగాలుచేసేవి. చంద్రుడుకూడా గంధర్వుడు. దాని అప్సరసలు 'శేకురి' అనే పేరుగల నక్షత్రాలు. అవి ''భాం కుర్వంతి ఇతి

భేకురయః'' అనగా ప్రకాశాన్నిచ్చేవి. వాయువు గంధర్వుడు. 'ఊర్జ్' అనే పేరుగల ఆపః= జలం లేక ప్రాణం వాని అప్సరసలు. అవి బలపరాక్రమాలనిస్తాయి. యజ్ఞం గంధర్వుడు. 'స్తావా' అనే పేరుగల దక్షిణ దానికి అప్సరసలు. ''దక్షిణాభిర్హియజ్ఞః స్తూయతే అథోయో వై కశ్చన దక్షిణాం దదాతి స్తూయత ఏవ సః'' (శత. బ్రా. 9-4-1-11) అంటే దక్షిణతో. యజ్ఞం యొక్క స్తుతి జరుగుతుంది. ప్రశంసింపబడుతుంది. మనస్సు గంధర్వుడు. 'ఇష్టి' అనే పేరుగల ఋక్ మరియు సామము దాని అప్సరసలు. ఎందుకంటే ఋక్, సామ మంత్రాలతోనే అన్ని ఇష్టిలు (ఆ+ఇష్టి=ఐష్టి) విద్వాంసుల సత్కారం, సత్సంగం, విద్యాదుల దానం జరుగుతుంది. ఇచ్చట సాయణాచార్యులు కృష్ణయజుర్వేదానికి చెందిన తైత్తిరీయ సంహితా 3-4-7లో ఈ ప్రసంగంపై వ్యాఖ్యానిస్తూ అగ్ని మున్నగు పేర్లుగల గంధర్వ పురుషులకు ఓషధి మున్నగు నామములుగల అప్సరసలు, అంటే వారి ప్రియ భార్యలు కలరన్నారు. ఇలా భౌతిక వ్యక్తులపరంగా అర్థంచెప్పిన వీరు ఇంతకంటే విశేషంగా ఆలోచించలేకపోయారు. ఈ వేద మంత్రాలకు ఆధిదైవికార్థాలు కూడా ఉండవచ్చుననే భావన ఆయన సామాన్యబుద్ధికి తట్టని విషయం!

ఇదే విధంగా యజుర్వేదంలోని 15వ అధ్యాయంలో రెండు-రెండు చొప్పున జంటలుగా అప్సరసల పేర్లు లెఖింపబడ్డాయి. ప్రకరణానుసారం ఇవి దిశ, ఉప దిశలకు పేర్లు. ''అప్సు అంతరిక్షే సరతః ఇతి అప్సరసా'' అంటే ఇవి అంతరిక్షంలో ప్రసరిస్తున్నాయి కనుక అప్సరసలని పేరు.

పుంజిక స్థలా చ క్రతు స్థలా చాప్సరసౌ-15. అంటే పుంజిక స్థలా మరియు క్రతు స్థలాలు అప్సరసలు, మేనకాచ సహజన్యా చాప్సర సౌ-16. మేనక మరియు సహజన్యాలు రెండూ అప్సరసలు. ఇదే విధంగా ప్రంలోచంతీ చానుంలోచంతి చాప్సరసౌ-17. విశ్వచీ చ ఘృతాచీ చాప్సర సౌ-18. ఉర్వశీచ పూర్వ చిత్తి శ్చాప్సరసౌ-19. అంటే ప్రంలోచంతీ అను లోచంతీ మున్నగు అప్సరసలు రెండు-రెండు

జతలుగా ఉన్నాయి. ఉవ్వటుడు, మహీధరులవంటి భాష్యకారులుకూడా యిచ్చట ''పుంజికస్థలా క్రతుస్థలా చేత్యప్స రసౌ దిగుపది గ్రూపే'' అంటే పుంజిక స్థలా మరియు క్రతుస్థలా మున్నగు అప్సరసలు దిశలు-ఉప దిశలకు పేర్లు అని వ్రాశారు. కానీ తరువాత పుంజిక స్థలా మున్నగు శబ్దాలను వివరిస్తూ వారు తమ అభిప్రాయంపై స్థిరంగా ఉండలేక అసంబద్ధంగా మాట్లాడసాగారు. వారికి అప్సరసలు సుందరీమణులుగా కనుపించసాగారు. ఉదాహరణకు : ప్రంలోచంతీ అనుంలోచంతీ శబ్దాలకు వారు అర్థాలు వ్రాస్తూ- ''ప్రంలోచంతి నరం ప్రత్యాత్మానం దర్శయతీతి ప్రంలోచంతీ'' అను వారం వారం మ్లోచంతీ త్యను మ్లోచంతీ'' అంటే పురుషుని ఎదుట తన సౌందర్యమును ప్రదర్శించుకొనే అప్సరసలు ప్రంలోచంతీ అప్సరసలు. పదే పదే (మాటి-మాటికి) అలా చేసేవారు అనుంలోచంతి అప్సరసలు అన్నారు. ఉర్వశీ అనే పేరు ఎలాగూ నిందావాచకమే. దాని జోడియైన పూర్వచిత్తి శబ్దానికి చేసిన వ్యాఖ్యలోకూడా వారిలా వ్రాశారు-

''రూపాతిశయాత్ పూర్వమేవ పుంసాం చిత్త ముపైతీతి పూర్వ చిత్తిః'' తన సుందర రూపంతో ఎటువంటి హావ భావాలను ప్రదర్శించకుండా ముందుగానే పురుషుల మనస్సును దోచుకునేది పూర్వచిత్తియనే పేరుగల అప్సరస. ఇదే విధంగా మేనక మరియు సహజన్యల విషయంలో కూడా వారిలా వ్రాశారు-

''మానయంతి ఏనాం మేనకా.

జనైః సర్వైః సహస్థితా సహజన్యా సర్వసాధారణా.'' అంటే తనను ఎక్కువగా గౌరవించునట్లు చేసుకొనునది మేనక. అందరితో కలిసి కూర్చునేది సర్వసాధారణా సహజన్యా అనే పేరుగల అప్సరస. ఇలా వీరు చేసిన వేద భాష్యం పూర్తిగా అనేక అసభ్యకర, ఏవగింపు కలిగించే లీలలతో నిండియున్నది. వాటిని గూర్చి చర్చించక పోవటమే మంచిది!

నిరుక్తం వ్యాకరణాల ఆధారంగా అప్సరస శబ్దానికి అనేకార్థాలు చేయవచ్చును. కానీ ఒకచోట మహర్షి దయానంద సరస్వతి 'అప్సరస

శబ్దానికి చేసిన అర్థాన్ని పరిశీలించాలి. పాణిని మునికృత ఉణాదికోశంలోని సూత్రాలకు వ్యాఖ్యానంచేస్తూ 4-137 సూత్రంలో ఆయన యిలా వ్రాశారు-
''నప్సాని భక్షయన్తి రక్షాం కుర్వన్తీ త్యప్సరసః''
''భక్షించకుండా ఎవరిని రక్షిస్తారో వారిని అప్సరసలందురు''

వహ్వా! ఎంత చక్కని మాట. అప్సరస అనే పేరు వినబడితేచాలు. అదేదో పురుషులు అనుభవించే సుందరమైన స్త్రీగా ఊహించుకొని ఆ ఊహ లోకంలో మునిగియుండే పురుషులుగల నేటి సమాజంలో స్త్రీకెంతో ఉన్నత స్థానమిచ్చి సమాజానికొక క్రొత్త బాధ్యతను గుర్తుచేసి స్త్రీ భోగించుటకు కాదు, సమాజానికొక వెలకట్టలేని నిధియని, అందువలన ఆమెను రక్షించుట అవసరమని చెప్పుట నిజంగా మహర్షియొక్క గొప్ప దూర ( దివ్య) దృష్టికి నిదర్శనం. నిరుక్తకారుడైన యాస్కమహర్షి కూడా యిచ్చట భక్షించుటకు కాదు. దర్శించుటకు అని చెప్పి ఈ అర్థాన్నే చెప్పారు. కాని మహర్షి దయానంద సరస్వతియొక్క సూక్ష్మ దృష్టికి ఒకవస్తువును దర్శించుట లేక ప్రదర్శించుట అనగా ఆ వస్తువును అనుభవించుట లేక భోగించుట కాహ్వానించుటయే ఔతుంది. అటువంటి అర్థాలు చేయుటవలన సమాజ ఉద్ధరణ ఎన్నటికీ సంభవం కాదు. అందుకే ఇలాంటి ప్రసంగాలలో ఎంతో జాగ్రత్తగా వ్యవహరిస్తూ మహర్షి దయానంద సరస్వతి ప్రజల మనస్సు, బుద్ధులను ప్రక్షాళనం చేస్తూ పోయేవారు. మనకిలాంటి అధ్యయనం, మననం చేసే దృష్టికోణాన్ని ప్రసాదించిన ఆ మహనీయునకు నిజంగా మనందరి పైనా ఎంతో దయ. తత్ఫలితంగానే గంధర్వ- అప్సరసలు వంటి వైదిక శబ్దాలకు చేసిన అశ్లీల అర్థాల బురదనుండి మనం బయపడి నిర్మలమైన వేదార్థాలను తెలుసుకునే ప్రయత్నం చేయగలుగు చున్నాము.